సలహా సేవాపథకాన్ని మహిళాభ్యుదయ సంస్థ అని పేరుగల సోదరసంస్థ సహకారంతో నిర్వహించడం కూడా జరుగుతోంది.

ఈ వేదికలో పదవీ నిర్వహణ చేసేవారు వేదిక స్థాపనకు పూర్వమే ఇలాంటి వివాహాలను అనేకం చేశారు. త్రిపురనేని కవిరాజు ఉద్యమం, హేతువాద ఉద్యమం, హ్యూమనిస్టుల ఉద్యమం కుల నిర్మూల నోద్యమా లతో వారికి సన్నిహిత సంబంధాలు ఉన్నాయి. అలా సంస్కరణోద్యమ కార్యకర్తల సహకారం వేదికకు లభించింది.

వేదిక లక్ష్యాలకు సమ్మతి తెలియజేసి వివాహమాడదలచిన స్త్రీ పురుషుల పేర్లు నమోదుచేసి తద్వారా వారి కవసరమైన సమాచారాన్ని వేదిక అందిస్తున్నది. కొన్ని వివాహాలను వేదిక కార్యస్థానంలో జరిపించింది కూడా.

వేదిక కార్యస్థానమైన వికాసకేంద్రంలో ఎన్ని వివాహాలు జరిపాము అనేదానికన్నా భావ ప్రసారానికి ప్రాధాన్యత ఇవ్వబడుతోంది. వేదికవల్ల ప్రబోధితులైనవారు. వేదిక సలహా సేవా పథకంవల్ల సహాయం పొందిన వారు వేదిక కార్యస్థానంలో కాని వేదిక ఆధ్వర్యంకింద కాని తమ పెళ్లిళ్లను చేసుకోవాలనే నియమం నిబంధనా లేవు. అందువల్ల వేదిక పదవీ నిర్వాహకులను ఇతరులు వివాహ నిర్వాహకులుగా ఆహ్వానించడం జరుగుతోంది. వరకట్న రహిత, మత తంతు రహిత, కులాంతర మతాంతర వివాహాలు విరివిగా జరగాలని ఈ సంస్థ ఆకాంక్షిస్తున్నది.

భారతదేశం, లెక్క ప్రకారం 20వ శతాబ్దంలోవున్నా భావాల పరంగా మధ్య యుగంలో వుంది. ఇటీవల దేశంతో జరిగిన పారిశ్రామికీ కరణవల్ల సమాజంలో కొంత కుదుపువచ్చింది. అంతేకాక ప్రపంచంలోని ఇతర దేశాల ప్రజల సంస్కృతీ నాగరికతలు మనకు పరిచయమయ్యాయి. దాంతో పాత విలువలను కాదనడం, పాత భావాలపై దాడిచెయ్యడం సాగుతోంది. వివాహవ్యవస్థకూడా విమర్శకు గురి అయింది. యుగయుగాలుగా, తర తరాలుగా అంగీకారాన్ని పొందినభావాలు నేటికి సవాలును ఎదుర్కోవలసి వస్తోంది. ఈ పరిస్థితుల్లో యువతరం అయోమయావస్థలోనికి పోతోంది. ఈ సందర్భంలో చర్చావేదిక ద్వారా భావస్పష్టతను చేకూర్చుకొని ముంద డుగు వేయ నుంకించుట జిజ్ఞాసాపరుల కర్తవ్యం.

ఏ రాజకీయ పాలనలోవున్నా ఏ ఆర్థిక వ్యవస్థలోవున్నా 90 శాతము యువతీ యువకులు వివాహమాడుతున్నారు. వివాహం వారి జీవితంలో ప్రధాన భూమికను నిర్వహిస్తోంది. కనుక వివాహాన్ని గురించిన పరిజ్ఞానాన్ని, అవగాహనను యువతీ యువకులకు అందజేసే నిమిత్తం ఈ సంఘం ఈ సెమినారును నిర్వహిస్తోంది. వైవాహిక జీవితంలో స్త్రీ పురుషులకు స్వేచ్ఛ కుంటుపడుతోందని, పెళ్లికి పూర్వం ఎంపికకు అవకాశాలు దాదాపు మృగ్యమని, వివాహ సందర్భంగా ప్రేమాభిమానాలు తప్ప తతిమ్మా అంశాలు అంటే కులము, శాఖ, మాత్రము, కట్నము, ఆస్తి, అంతస్తు పరిగణనలోకి వస్తున్నాయని అందువల్ల వివాహ వ్యవస్థను త్రోసిరాజనాలని తీవ్రమైన వాదనలు వినిపిస్తున్నాయి. వీటి నివారణకు కులాంతర మతాంతర వివాహాలను ఒక వర్గంవారు ప్రతిపాదిస్తే కుల మత ప్రసక్తిలేని వివాహాలను మరొక వర్గం వారు సూచిస్తున్నారు. అంతటితో ఆగక ఒకే కులంలోని వివాహాలను నిషేధించాలని వేరొక వర్గం వాదిస్తోంది. వివాహానికి మత తంతు అక్కరలేదని కొందరు ప్రచారం చేస్తున్నారు. ఈ తర్జన భర్జన ఇలా ఒకవైపు సాగుతుంటే మరొకవైపున వరకట్నాల కోసం తాపత్రయం హత్యలకు, మరణాలకు దారితీస్తోంది. వరకట్న దురాచారం స్త్రీని న్యూనత పరుస్తోందని, వధువు తల్లిదండ్రులకు భారంగా పరిణమిస్తోందని స్త్రీ విమోచనోద్యమ కార్యకర్తలు ఘోషిస్తున్నారు. నూతన వివాహ రీతులను సమాజం అన్వేషిస్తోంది. యువతరం ఆదర్శ సమాజానికి బాటలు వెయ్యాలని ఆశించడంలో పొరపాటులేదు. ఇలాంటి భావప్రసారం చేయడానికి ఇలాంటి వేదికలు అవసరమని ఈ సంస్థ నిర్వాహకుల అభిప్రాయం. అందుకే పై అంశాలను క్షుణ్ణంగా పరిశీలించే పరిశోధనా వ్యాసాలతో ఈ సెమినారు జరుగుతుంది.



వేదిక చేపట్టే కార్యక్రమాలకు చేయూతనిమ్మని అభ్యుదయ కాముకులను అభ్యర్థిస్తున్నాం

—కార్యదర్శి

—)(—